శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# పాండవప్రవాసము.

నాటకము. 

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచింపఁబడినది

మూడవకూర్పు 2000 ప్రతులు.



కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1915.



[వెల 12 అణాలు.

# ఈనాటకమునందువచ్చు ముఖ్యపాత్రలు.

### I వ యంకము.

1 ద్రోణుఁడు
2 పంచపాండవులు
3 ద్రుపదుఁడు

### II వ యంకము

1 బ్రాహ్మణదంపతులు
2 కుంతీదేవి
3 భీముఁడు
4 బకుఁడు
5 హిడింబ

### III వ యంకము.

1 భటుఁడు
2 ద్రుపదుఁడు
3 పురోహితుఁడు
4 ధృష్టద్యుమ్నుఁడు
5 దుర్యోధనుఁడు
6 దుశ్శాసనుఁడు
7 కర్ణుఁడు
8 శ్రీకృష్ణుఁడు
9 బలరాముఁడు
10 ద్రౌపది
11 పంచపాండవులు
12 కుంతి

### IV వ యంకము.

1 విదురుఁడు
2 పంచపాండవులు
3 ధృతరాష్ట్రుఁడు
4 భీష్ముఁడు
5 ద్రోణుఁడు
6 దుర్యోధనుఁడు
7 దుశ్శాసనుఁడు
8 శకుని
9 కర్ణుఁడు
10 వికర్ణుఁడు
11 ప్రాతిగామి
12 ద్రౌపది

### V వ యంకము.

1 అర్జునుఁడు
2 ఊర్వశి
3 దాసి
4 ఇంద్రుఁడు

### VI వ యంకము.

1 ధౌమ్యులు
2 ద్రౌపది
3 సైంధవుఁడు
4 పంచపాండవులు
5 దాసి

### VII వ యంకము.

1 గాయకుఁడు
2 సైరంధ్రి
3 ఉత్తర
4 బృహన్నల
5 ఉత్తరుఁడు
6 గోపాలకుఁడు
7 భీష్ముఁడు
8 ద్రోణుఁడు
9 కృపుఁడు
10 అశ్వత్థామ
11 కర్ణుఁడు
12 దుర్యోధనుఁడు

### VIII వ యంకము.

1 పంచపాండవులు
2 ఉత్తరుఁడు
3 విరటుఁడు
4 రాయబారి
5 సైరంధ్రి

# ఉపోద్ఘాతము.

—:o:—

ఈ పాండవప్రవాసమునందలి కథ, పాండవుల విద్యాభ్యాసము మొదలుకొని విరాటపర్వము తుట్టతుదవఱకును గల యంశములతో నిమిడియున్నది. పూర్వముద్రణమునందలి తప్పులు కొన్ని యిందు సవరింపఁబడినవికాని మఱికొన్ని యిందునుం గలవు. వానినెల్లఁ జదువరులు జాగరూకులై సవరించుకొనఁ బ్రార్థితులు. ఇందుఁగల ప్రయోగరహస్యములను దెలిసికొనఁజాలక తప్పుగా దలఁతురేని వారు మా సపాశుపతపాండవాశ్వమేధముం జూచినపిమ్మటఁగాని యట్లుతలఁపకుండుటకుఁ బ్రార్థింపఁబడుచున్నారు. కథాంశములు భిన్నభిన్నములైనను గర్తలొకరే యగుటచేఁ జాలవఱకుఁ బ్రయోగములొకటేవిధముగా నుండునుగాన నిట్లభ్యర్థించితిమి. పరిశీలకులగు కవులకుఁ బరిశీలకులగు విమర్శకులు దొరకుట బంగారమునకుఁ దావి యబ్బుటవంటిదియని మేమెఱుఁగుదుము. కాని నేటివఱకు మాకాభాగ్యము తటస్థించినదికాదు. కాలమహిమనుబట్టి పండితకవులే కర్మమునెఱుఁగని వారలకు జంకవలసివచ్చుచున్నది, "కాకుదంతాలు", అని భట్టోజీదీక్షితులుగారు సిద్ధాంతకౌముదిలోనుదాహరణమీయఁగా దానిం జూచియొకఁడు "దీక్షితులకుఁ దెలుఁగురాదు కాకిదంతాలుగాని కాకుదంతాలేమిటి" అని యాక్షేపించెనఁట? ఇప్పటి మావిమర్శకులెల్ల నిట్టివారుగానే కన్పట్టుచున్నారు. మాపుస్తకములు విమర్శింపక యొకరు మమ్ముదయఁదలఁచి వదలిపెట్టినట్లు పత్రికలో లిఖించుకొన్నారు. ఒకరవనేల? వారు శ్రీకాళ్ళకూరి నారాయణపగబ్రహ్మకవిసార్వభౌములుఁగారు. లేకున్నచో మాగ్రంథములగతియేమగునో సంశయింపవలసినదే. ఏమందురా? ఇంతకుమున్ను బ్రహ్మశ్రీ పేరి కాశీనాథశాస్త్రులవారొకపరి మాగ్రంథము నువిమర్శించిరి. వీ రుభయశాస్త్రపారంగతులు, సాహిత్యచక్రవర్తులు. వారివిమర్శనము తుదకేమైనదో వారేనుడువఁగలరు. పిమ్మటఁ బిఠాపురము దర్బారుకవులు వెంకటరామకృష్ణులు విమర్శించిరి. వారివిమర్శనమేమైనదో మాసపాశుపతపాండవాశ్వమేధమే. తెలుపఁగలదు ఇటీవలమఱియొకరెవరో విమర్శించిరి. వేరొందులకుచ్చరింపవలెను. ఆపేరును నావిమర్శనమేమైనదియుఁ మాతృణీకరమువలనఁ దెలిసికొనఁదగు. ఓదుష్కాలమా! ఇకనైనఁ దిరుపతివేంకటేశ్వరుల గ్రంథములను మంచి విమర్శకులపాలుచేయఁ దలఁచుకోలేదా! వారినేల వృథాయాసము పాలుగావించెదవు. వారిగ్రంథముల నేల పెంచెదవు. "నాదయయున్నచో నగ్నమాత్రనభిజ్ఞాతయగు చాఁకలి పుల్లిగాఁడుగూడ కవిసార్వభౌముఁడగు. తిక్కన భారతమంతయు విమర్శించి తప్పులనగలఁ

డు. కావున నీకు నమస్కారముఁ గావింపవలసినదే" యనుచున్నావా! కానిమ్ము. అట్లే నీకొకనమస్కారముఁ గావించుచున్నాము. అనర్గళకవితాప్రవాహమునం దెచ్చటేని యతి మండూకప్లుతి గావించుట మహాకవులకు సహజప్రమాదమని శ్రీనాథాదికవుల గ్రంథములు పరిశీలించినవారికిఁ దెలియకమానదు. అవియుఁ గవులయజ్ఞానవిలసితములనియు 'నేనుమాత్రమూరకున్నానా దేనికో మున్ను వ్రాయుచునేయున్నా'నను సామెతగా మేమును దప్పులు పట్టఁగలిగితిమనియు ననుకొనువారికి మావందనములే ప్రత్యుత్తరములు. అట్టివారికియతియుఁ బ్రాసయుఁ దెలియదనుట యజ్ఞానమో దివ్యజ్ఞానమో పండితులే గ్రహింతురుగాత. ఇందుఁ గలిగిన లేఖకాది ప్రమాదములు సవరించుకొను భారము దయార్ద్రహృదయులగు మా చదువరులకే వదలుచున్నాము.

ఆర్యులారా !

ఈ పాండవప్రవాసమునకు తెనుంగు స్కూల్సు లోయరుక్లాసులకు పఠనీయ గ్రంథముగా నిర్ణయింపఁబడినదగుటచేఁ దృతీయముద్రాపణభాగ్యము తటస్థించినది. ద్వితీయముద్రణమునందలి లేఖకాదిప్రమాదము లిందునఁ గొన్ని సవరింపఁబడినను బ్రస్తుతమునందు మఱికొన్ని ప్రమాదములుండకమానవు గాన వానిని సహృదయులు మన్నింతురుగాత.

ఇట్లు

శతావధానులు

తిరుపతి వెంకటేశ్వరులు.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవప్రవాసము.

తిరుపతివేంకటీయము.

## నాటకము.

### ప్రథమాంకము.

( నాంది )

చ. జయమెదియిచ్చు నెయ్యదియొసంగెడు నేదిసుఖంబొసంగు న
న్వయ మభివృద్ధి చెందుటకునై మతి శుద్ధినిఁగాన మేది భా
నయ మొనగూర్చుఁ బాఠకుల కట్టిన శ్రోతలకున్, బ్రశస్త మ
వ్వయ మలభారతంబొసఁగుఁ బంచమవేదము మీ కభీష్టముల్.

[ నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును ]

సూత్ర—బావా ? ఇటురమ్ము.

మారి—ఇదె వచ్చితిని.

సూత్ర—మొన్నటి వ్యాసపూర్ణిమనాఁడు మన మొనరించిన పూజాపురస్కారములకు నలరి భారతగురువుగారు మనకిడిన యాశీర్వచనమును నీవును వింటివిగా ?

మారి—వినకేమి ? " పాండుపుత్రులంబోలె మీరును దుర్జయులై వెలగుదురుగాక " యని ప్రీతిపూర్వకముగ నాశీర్వదించిరి.

సూత్ర—తిరుపతివేంకటేశ్వరులచే రచింపఁబడిన పాండవప్రవాసమును బ్రదర్శింప నెంచిన మన కీనాఁడు వారి యాశీర్బలమున నెంతయు గొదువ రానేరదు. కావునఁ బాత్రముల నాయత్తపఱుపుము.

మారి—చిత్తము ( నిష్క్రమించును )

సూత్ర—పుణ్యమూర్తులగు నోసభాస్తారులారా !

ద్రోణా—అంతమాత్రముతోఁ జాలించిన నా కింత పట్టుదలయే లేకుండును.

నకు—గురువర్యా! ఇఁక నేమిచేసెను?

ద్రోణా—నన్ను జూచి యొకసక్కెముగా,

గీ. "ఏను మూర్ధాభిషిక్తుఁడ నీవు పేద బాఁపనయ్యవు మన కెట్లు పొసఁగు మైత్రి?
సరిసగే! శ్రీమంతు సామంత యాచకుల లక్కు, గాంగా, గనఁజేసితివి నీగుణంబు దెలిసె"
అని నన్నవమానించెను.

సహ—(కోపముతో)

ఉ. ఇగురుఁగ మేము నన్నలోక యిర్వురు నల్వురు నేకమై మహా
సురు లని సద్దమైన నలగాని సహాయుఁడు గాఁగ నిప్పుడే
ద్రుపదుఁ జేద్దముద్రుపదు ద్రోగ్బలముల్ హరియించి తెచ్చి యో
గురువర! మీకు దక్షిణగఁ గొంకక యిచ్చెద మింతయేటికిన్.

ధర్మ—గురువర్యా! ఇంతకుమున్న ధార్తరాష్ట్రులు యుద్ధసన్నద్ధులై యరిగిరిగదా వా
రల కతండు సాధ్యుండు గాకయుండునా!

ద్రోణా—ధర్మనందనా!

ఉ. ద్రుపదుఁ డహోని సంభవుఁడు ద్రోణులముందున నాకు శిష్యుఁ గాఁ
డపరిమితాస్త్రశస్త్రనిచయమ్ములఁ బద్ధతిఁ నాగితేత్తిన
ట్టి పరమశూరుఁ డాతని కడింది మగంటిమి కెవ్వఁడడ్డు? భూ
మిప! మనయర్జునుం డతని మించుఁ దదన్యులు నాతనిఁ జోపఁడే?

అర్జు—(సంతోషముతో) దేశికేంద్రా!

చ. కినిసి ప్రతిజ్ఞ లన్ సడలఁ గాఁ బవనాత్మజుఁ డగ్రమందు నా
క్కువ నఖసమ్మనన్ రిపులఁ గూల్చఁగ నేను గధర్మ నిక్కి యా
హవమునఁ బార్థగుం గదిసి ప్రాణముతోడన పట్టి తెచ్చి మీ
కవమతిఁ జేసినట్టి ఫల మందఁగ దక్షిణగా నొసంగెదన్.

ధర్మ—అర్జునా!

మ. ధనమున్ రాజ్యము నెందుకిచ్చెఁ? దనకున్ దైవంబు, ప్రాజ్యాల్ తపో
ధనులు న్మాన్యులు నైన యావిభులకున్ దారిద్ర్యబాధానిగం
జను లౌ పంగులు నంధులౌ జనులకున్ సంరక్షణ శ్రేయమం
దున కాదే? యొకపొట్ట కేమిటికి నిచ్చున్ మేటిసామ్రాజ్యమున్.

కావున నతం డకార్యమును దండ్యుం డగుట నట్లొనరింతువుగాక.

భీము—అన్నా! తక్కినవారిమా టెట్టులైనను,

క. పసినాఁటనుండియును నొ, క్కని మేపము పాయ కొక్క కాయంబై యుం
డిన మిత్రుఁ బాసి యిటుచే, సిన దుర్మార్గునికి నింక సిరి యెటు నిలుచున్.

నకు—గురువరా! నాకుఁ దెలియమి నడుగుచున్నాఁడను. క్షమించి యీసందియముం దీర్పుము.

మ. బకముం బోలె స్వకుక్షిరక్షణకునై ప్రాజ్యంబు రాజ్యంబుపూ
ను కఠోరాత్మకునిన్ గృతఘ్ను జడునిన్ దుశ్శీలు దుశ్శ్రీకుఁ జం
పక "ప్రాణంబులతోఁడఁ దె" మ్మనుచుఁ బంపం బాడియే? వీఁడు భూ
మికి భారం బగుఁగాదె? యెందుకొఱకో మీరిట్లు భాషించుటల్.

ద్రోణు—నాయనా! ఇతఁ డిప్పు డెట్టివాఁడైనను క్రమముగాఁ గష్టసుఖము లొంటఁ బట్టి పదవ లోకోపకారి కావచ్చును. కావున మన మితనిం జంపఁదగదు. "లేని దాతకన్న నున్న లోభి మేలుఁ" గని కదా? పెద్దలు చెప్పుదురు.

అర్జు—గురువరా! ఇఁక నాలస్య మెందులకు? పోవుదము పదుండు. (అందఱును బరిక్రమింతురు.)

భీము—(దృష్టినిగిడ్చి) అదిగో కాంపిల్యనగరము. కౌరవసైన్యమెల్ల ద్రుపదుని ధాటికి నోడి యెట్లు వెనుకకు వచ్చుచున్నదో!

అర్జు—(ద్రోణధర్మజులకు నమస్కరించి) మీరు సమీపమ్మున నే యుండి చూచుచుండుఁడు. మేము నల్వురమును జని,

క. మత్తాత్ముఁడైన ద్రుపదుని, నెత్తెఱఁగున నేనిఁ బట్టి యిప్పుడ యిటకున్
దెత్తుము తెచ్చినపై మీ, చిత్తం బెటునచ్చు నట్లు సేయఁగవచ్చున్.

(నలువురు నిష్క్రమింతురు.)

ధర్మ—మహాత్మా! ద్రుపదుం డయోనిజుం డని తాము నుడివితిరిగదా, యెట్టిది యది?

ద్రోణు—మున్నితనితండ్రి యగు పృషతుండు తపంబొనర్చుచు నొక్కనాఁ డన్నికటమ్మున మేనక యను నచ్చర కుసుమాపచయంబు సలుపుచున్న నద్దానిం గాంచి పరవశుం డగుటయు, నతనికి ధైర్యంబు నిలువదయ్యె. అమోఘవీర్యుం డగునతని తేజం బిట్లు పరిణమించె.

ధర్మ—(దృష్టినిగిడ్చి) అదిగో! సమర మెట్లు ప్రవర్తిల్లుచున్నదో చిత్తగింపుఁడు.

ద్రోణు—(చూచి) వత్సా! నేను ద్రుపదునిం గూర్చి యేమిచెప్పితిని?

చ. అతఁ డెటువంటివారలను నాహవమందున లెక్కసేయఁ డ
ప్రతిహతవిక్రముండు మనపార్థుపయి న్నిగిడించుచున్న యా

శితశరవర్షమే యతనిచేఁ బచించెను నైననేమి ని
ర్జితు నొనరించి తెచ్చు మనక్రీడి యకుంఠిత విక్రమమ్మునన్.

(తెరలోఁ బెద్దకలకలము.)

ధర్మ—(విని) గురువరా! ఏమి యీ హాహారవ మింత విపరీతముగా వినవచ్చుచున్నది?

ద్రోణు—హాహారవమున కేమున్నది? ద్రుపదుని యరదముపైకి సింగంబువలె లంఘించి మనయర్జునుం డతని నొడిసి పట్టి తనయరదమునకుఁ గట్టుచున్నాఁడు.

ధర్మ—(చూచి) అతిశీఘ్రగమనమ్మున నిచ్చటికే తీసికొనివచ్చుచున్నాఁడు.

[అంత ద్రుపదసహితముగా నర్జునుఁడు ప్రవేశించును.]

అర్జు—(నమస్కరించి) గురువరా! ఇదిగో దక్షిణ, పరిగ్రహించి యాశీర్వదింపుఁడు.

ద్రోణు—(ద్రుపదుం జూచి ఎకసక్కెముగా)

ఆ. వె. పేదపాఱుఁ డెవఁడో పెద్దరాజెవ్వఁడో, యిప్పుడైన నీకు నెఱుకపడెనె?
రాజ్య మేలు టుడిగి రాఁజన్నె? రిత్తల, మైనముఖ్యఁ జూడ నోవరేంద్ర?.

ద్రుప—(తలవంచుకొని యూరకుండును)

ద్రోణు—అర్జునా! ఇతని కీబంధనములు విప్పుము.

అర్జు—చిత్తము. (అట్లొనరించును)

ద్రోణు—ఓయి! పాంచాలభూపాల!

కం. నినుఁ జంటిపిల్లనికి గో, వు నొసంగెద నంచుఁ జూడఁబూనితి నీదౌ
ధనగర్వము నా కిత్త్యేడ, నొనరించె నఖండ మైనయోగము కంటే.

సమస్త ధర్మవేత్తయు నఖండ ప్రజ్ఞాధురంధరుండును రాజకులైకభూషణుండును నగు భీష్ముండున్నవాఁ డని యుల్లంగించి నిన్నుం జూడ వచ్చుట నాతప్పిదమే కాని నీతప్పిద మిందు లేశమును లేదు. ఇఁక నీయిచ్చం జనుము.

ద్రుప—(తనలో) అన్నా! బ్రాహ్మణప్రభావ మెంతదుర్జయ మైనది. వీరల కిట్టి శక్తి తపంబువలనం గదా! కలిగె. నేనును నట్టితపం బొనరించి యెట్టులేని నితని జయించి యీయవమానము బాపుకొందుఁ గాక. (నిష్క్రమించును.)

ధర్మ—గురువరా!

తే. గీ. కష్టపడి కట్టి తెప్పించి కడకు నింత, వైళమే యీతనిని విడువంగవలెనె
వృద్ధరాజుల కేవిఁ జూపింపవలదె?, యింతమెత్తని హృదయమే లెందుఁ జూడ,

ద్రోణు—తండ్రీ ధర్మనందన!

కం. అవనీసురులకుఁ గోపము, దవులంగాఁ జనదొకటఁ దవిలిన నొకజా
మాత్రిగఁ బోవలె నటుగా, క వివేకపుఁగోప మొందు నతఁ డంత్యజుఁడౌ.

అర్జు—అదుగో, అన్నయ్యలు, గవలును మన సైన్యములను నిటువచ్చుచున్నవి. ఇఁక మనము గూడ వారిఁ గలసికొని పురమ్మున కరుగుదము. (నిష్క్రమింతురు)

గద్య

ఇది శ్రీ...తిరుపతివేంకటేశ్వర ప్రణీతం
బగు పాండవప్రవాసమ్మునఁ
బ్రథమాంకము.



# పాండవప్రవాసము.

## ద్వితీయాంకము.

[అంత నిర్వురుబ్రాహ్మణదంపతులు ప్రవేశింతురు]

భార్య—నాథా! నేనుండఁగా మీ రాయసురుని కాహారం బగుట న్యాయము కాదు. అందులకై నే నరిగెద. నామనవి విని న న్ననుగ్రహింపుఁడు.

భర్త—(విచారముతో)

తే. గీ. అగ్ని సాక్షిగఁ బెండిలి యైనయట్టి, పరమసాధ్విని సంతానవతిని నిన్ను
ననురకాహారముగఁ బంపి యసువుల నరక, మనుభవించుటకన్న నియ్యదియె మేలు.

భార్య—నాథా! మీ రట్లు సంశయింపవలదు. భార్య సంతానార్థముగా నేర్పడినది. అట్టిఫలము నాఁటన నిదివఱకే కలిగినది. నన్ను వానికై యర్పించి కొమరునిం గొమార్తెను రక్షించుకొనుఁడు.

భర్త—అకటా! నే నీపలుకులు వినఁజాలను. ఓహో! దైవమా!

గీ. నరుల భక్షించునట్టి దుర్నయుహిడింబు, సమయఁగాఁజేసెనఁటకదా శౌర్యధుర్యుఁ
డెవ్వరో యొక్కరుఁడు లోకైక...ఁడు, డతని నివ్వానిఁజంప నీ కనువరాదె?

భార్య—ఆహా! ఆమహానుభావునిఁ గన్నతల్లి యెంతపుణ్యాత్మురాలో కదా! ఎల్లకాలము నాపె కడుపు చల్లనై వర్ధిల్లుఁగాక.

[బ్రాహ్మణస్త్రీవేషముతోఁ గుంతి ప్రవేశించును]

కుంతి—అమ్మా! మీ రెందులకో యిట్లు విచారించుచున్నారు. వినఁగా వినఁగా మీయాపదతెఱంగు నాకు స్పష్టపడినది. మీదంపతులుగాని మీకొమరుఁడుగాని కొమరితగాని యామునిక్కడిరక్కసుని కాహారముగఁ బోనక్కరలేదు. నాకైదుగురుకొమరులలో నొక్కరునిం బంపెద. మీరు స్వస్థతం జెందుఁడు.

భర్త—అక్కటా! ఎంతమాట వినవలసివచ్చినది.

గీ. అన్నవస్త్రమ్ములకు లేక యాసదేఁగుచు, నతిథులై మద్గృహమ్మున నడఁగియున్న
మీకు నపకృతిఁ గల్పించి మేను పెంచి, బ్రతుకుదునె యపకీర్తికి భాజనముగ.

కుంతి—మాకది యపకారంబుకాదు. ఉపకారమే, ఏమంటిరా? నాకొమారుండా రక్కసునిం జంపి యిహపరంబులఁ బ్రతిష్ఠయుఁ బరమందుఁ బుణ్యమును నార్జించువాఁడే కాని వానిచేఁ జిక్కువాఁడు కాఁడు.

భార్య— అమ్మా నీవిట్లాడెదవేమి? ఈ బకాసురుఁడు సామాన్యుఁ డనుకొంటివా? వీని గొల్వరాజు లెవ్వరును యింతకు లేకయే కద ప్రతిదినము నొక్క మానిసిని రెం డెనుబోతులను, ఒక బండియన్నమును నియతముగా నిచ్చుట కేర్పఱచుకొనిరి. వీనిం జంప నెవ్వరలకు వశముగాదు. ఎప్పుడో ఘటోత్కచజనకునివంటి మహానుభావుఁడు పుణ్యము కట్టికొనవలెను.

కుంతి— అట్టివాఁడే నా కొమరుఁడును నున్నాఁడు, మీ కది యెఱుఁకయు నేఁటులకు? మీ రూరకొనుఁడు. నే నీపని నెఱవేర్పించెదను.

భార్య— అమ్మా! నీకు నిజముగ నాపద రాకుండను నమ్మిక యున్నచో నట్లొనరింపుము లేనిచో మాకొఱకు నీవు పుత్రశోక మనుభవింపకుము.

కుంతి— నా కట్టియిక్కట్టు లేశము లేదు. వానికిం జనియెడ లెఱుఁగక దుఃఖింపు మీసంతానము నోదార్పుఁడు లెండు. అదె నా కొమరుఁడు భిక్షాటనంబు గొని వచ్చుచున్నాఁడు నే నతనితోఁ జెప్పి వానిం బంపించెద.

(ఇరువురును నిష్క్రమింతురు)

[అంత భీముఁడు సంకజోలితోఁ బ్రవేశించును]

భీము—(జోలిసంకఁ జాచుకొని తనలో)

. అఁకట నాకుం గడు పెంతో కట నకనకలంబడెడు నొకకబళంబే
నీ కాదు బికిరిపుం గూ, ఛీ కాసంతయును, నెట్టు లీదిన మేగున్!

ఏమో? యీదిన మెక్కడికేగినను లే దనువారే కాని మాధుకరము వైచువారే అరుదు. లాక్షాగృహంబు వెలువడి వచ్చినయది మొదలు నాకుఁ గడుపునిండ నన్నమే లేదు. అక్కడికిని పల్లె మే మేఁగురమును దెచ్చినయన్నమును నేకరాశిఁ జేసి యందు సగపాలు నాకుఁ బ్రత్యేకము గడువఁ బెట్టుచుండును. ఛీ! ఈ దరిద్రపువృత్తి కన్న నధమవృత్తి వేఱొండు లేదు. (కోపముతోఁ బ్రకాశము) ఔరా! యంధ రాజా! నేత్రాంధుఁడవే కాక దుర్గుణాంధుఁడవు గూడ నైతివిగా!

ఉ. కూళతనమ్మునం గొడుకు కోరెడికోర్కెకు సమ్మతించి భూ
పాలుని ధర్మనందను నుపాయముమైఁ బరి వెళ్ళఁగొట్టియుం
జాలక లక్కయింట నిడి చంపఁగ నగ్గి దగిల్చితే? కటా!
జాలి యొకింత లేద? నరజన్మము నెత్తవె? గొడ్డువాఁడవే.

కుంతి—(సమీపించి తనలో) ఏమో యీవేళ నితఁడు కడుఁ గోపముగ నున్నవాఁడు. ఓహో! ఇదియా హేతువు? ఈనాఁడు జోలి నిండుగా నిండలేదు. అక్క-

టా! దైవమా! రాజాధిరాజగు పాండునృపాలునిపుత్త్రుల కట్టియవస్థ కల్పించితివి? (ప్రకాశము) తండ్రీ! ఎందుకోయి, ఆవృద్ధరాజు నట్లు నిందించుచుంటివి? ఇది యంతయు నాజన్మశత్రుఁడగు నాదుర్యోధనుని దుర్మంత్రమే కాని మఱియొకటి కాదు. నీయన్నను యువరాజుఁగాఁ జేయుటకు సహింపక, కొడుకు సారెసారెకుఁ దనయొద్ద కరుదెంచి విచారింపఁగాఁ దనయాపచ్ఛక్తిని జెప్పి చూచి తుదకు మనకు వారణావతము నివాసముగా నేర్పఱచెను. ఆపై జరిగినలాక్షాగృహదాహప్రయత్న మతఁడు లేశమును నెఱుఁగఁడు. ఇది యంతయు సుయోధనునిపన్నుగడ. ఇంతకు విదురుఁడనియొకమహాత్ముం డుండుటంబట్టి గాని మన మాపురోచనుని మాయలోఁ బడి మ్రగ్గినవారమే. పోనిమ్ము తండ్రీ! ఇఁక వారలం దలఁపకుము. మనకు మంచిదినములు రానున్నవని వ్యాసులవారు చెప్పుట వింటివి కదా?

భీము—అమ్మా! నాఁడు నేనొక్కపని చేయవలసినది సుమీ!

మ. కలియన్ గట్టి సుయోధనాదిశతముం గాలాంతకుండో యనం
బలిమి న్నెత్తిని బెట్టి తెచ్చి జతుసద్మంబందు మున్నగ్ని సం
ధిలఁగాఁ జేసి యొకొక్కనిన్ గ్రమముగా దీపించునావహ్నికిం
బలిగా నిచ్చినచో ననున్ జగము మేబా సంచు శ్లాఘింపదే.

కుంతి— తండ్రీ! శాంతింపుము. ఎన్నటికేని యాసుయోధనునికి మంచిబుద్ధి కలుగకపోవునా? కలిగినచో మీరును మీరు నేకముగా నుండకపోదురా?

భీము—తల్లీ! ఎంత వెఱ్ఱిదానవు?

ఉ. పుట్టినబుద్ధి వాని కిఁకఁ బుల్లలతోడను కాని పోదు నీ
వెట్టి యమాయకత్వ మొకొ? యించుకయేని యెఱుంగ వక్కటా!
పెట్టఁగఁ జేయఁడే విషము, పెద్దనదిం బడఁద్రోయఁ జేయఁడే
కట్టిడుఁడై విషాహులను బెట్టి ననుం గఱపింపఁ జేయఁడే.

కుంతి—తండ్రీ! పెద్దవారెప్పుడును పెద్దవారలే కారు. సారెసారెకు నదియే తలపోయకుము. ఈమాట వినుమా. మనవలన మఱియెట్టి గృహస్థుని కేకయుపకారము కావలసియున్నదఁటోయి.

భీము— (ఆదరముతో) అది యెట్టిది యైనను దప్పక చేయవలసినదే.

కం. మనకుఁ దమయిల్లు వాస, మ్మునకిడి బంధుగులకన్న మోమోటమునం
జన నొసఁగినట్టి యుపా, సనునిఋణము దీర్చుకొంటె భాగ్యము కలదే.

అదియేదో చెప్పుము.

కుంతి—నీవు కడు నాఁకొని యున్నవాఁడవు లోనికిరమ్ము. భోజన మైనపిమ్మటఁ దెల్పెదను.

భీము—తల్లీ! యేమట్లంటివి? బ్రాహ్మణకార్యముకన్న నాకు భోజన మెక్కుడా? (స్మృతినభినయించి) ఈపట్టణములోని జనులనందఱిని బకాసురుం డను నొక్క మ్రుక్కడిరక్కసుండు బాధించుచున్నవాఁడని వింటిని. వానిబాధ వీరి కేమైనఁ దటస్థింప లేదు కద! ఆఁ! జ్ఞప్తి యైనది (కోపముతో)

మ. ఇపుడే పోయి మదాంధు నచ్చెనటి నాహీనుం గఠాచారు న
చ్చపలుం గ్రూరు నరాశిఁ బట్టి త్రుటిలో సంగ్రామరంగంబున
న్విపులం గూల్చి "మహానుభావుఁ డెవఁ డీవిప్రార్భకుం" డంచు నా
యుపకారమ్మును బౌరు లెన్నుకొనఁగా నుత్సాహినై వచ్చెదన్.

కుంతి—తండ్రీ! వానినే నీవు వధింప వలసినది. వానినిమిత్తము వండినవంటలు మొదలైనవవి లోన వండుచున్నారు. తృప్తిగా నవి భుజియించి మఱియుం బొమ్ము.

భీము—అట్లనే యొనర్చెదను (కోపముతో) ఓరీ! ఏకచక్రపురసరోవర కూర్మ బకబక!

ఉ. దేవుఁ డొసంగునంగములఁ దెల్విమెయిం బని చేసి చక్కఁగా
జీవనమున్ బొనర్పక కుచేష్టుఁడవై మదమెక్కి యూరికే
జీవుల బాధపెట్టెదవ? ఛీ! చెడుసోమరిపోఁత? నీ కిదే
చావు తటస్థ మయ్యె నిఁక సాగవు నాయెడ నీప్రతాపముల్.

(అని తల్లితో నిష్క్రమించును) (బకుఁడు ప్రవేశించును)

బకుఁడు—(పరికించి) ఓహో! ఏమి యీనాఁ డింతపొద్దయినను నాకాహారము వచ్చినదికాదు? (కోపముతో) ఔరా? పౌరుల కింత యేమఱుపాటా? సరే వీరల నెల్ల నొక్కదినమే భక్షింతుఁ గాక!

తే. గీ. ఒక్కమానిసియును దున్న లొక్క రెండు, బండెడన్నము నాకొక్క పంటికింగి
కైన నచ్చునె? పోనిమ్మటంచునోర్వ, గొన్న నదిగూడఁ గ్రమముగా సున్న యయ్యె.

ఓరీ! ఏకచక్రపురవాసులారా!

శా. చేత న్నాకరయొ యింతస్వల్పమున కాసించెద న్నకం డంచు మీ
చేతమ్ముల్ దలపోయఁ బోలు నవురా? జీమూతసంఘాత ని
ర్ఘాతవ్రాతకఠోర నన్నెఱుఁగరే? కాలంబు దాపయ్యెనే?
గోతం గూలితి రేదురాత్ముఁ డిటు మీకు జ్ఞప్తి దుర్బోధముల్?

ఔరా? విరుద్ధము, ఏమీ పొసగదు? భ్రుకుటివిక్షేపమాత్రవిత్రస్తీకృతత్రియంబకుం డగు
బకుం డే మీ యనుమతికి భాజనమయ్యెం గా! (యోజించి) ఈతప్పు నాకరుణది
కాని మీది కాదు.

ఉ. ఏడుచుచున్న వార లిటు లేకముఖంబుగ వచ్చియుండు మో
మోడి యనుగ్రహించుటవియుం దోసఁగయ్యెనె? నేను వాఁకట
న్నాఁడుచునుండ మీరలు సమగ్రముగా భుజియించివచ్చి న
న్నూడఁగ వేఁడుకయ్యెనె? నృసూదనుఁ డీబకుఁ డంచు చెలఁగరే.

ఇంతకు మీరేమిచేసెదరు! కలియుగం బాసన్నమవుటచే మీకిట్టి దుర్బుద్ధులు పుట్టుచు
న్నవి. కానిచో,

ఉ. ఎప్పటినుండి నాకు బలి యిట్లిడుచుండిరి నేఁడె పుట్టెనే?
తప్పనె యింతమాత్రమున, దానవజాతి యటన్న నింతగా
నెప్పుడు నొల్లదం బగుట నిప్పటి కేవినలేదు నేఁటికి
న్మ్రప్పాడఁగూడి క్రొత్తలగు మున్నరికంబులు మీకుఁ జొప్పడెన్.

(చెవియొగ్గి) ఏగో ధ్వని వినవచ్చుచున్నది (చూచి) బండికాలెం బొడకట్టుచున్నది. (కొం
చెము నడచి) అవును నానిమిత్తమై వచ్చెడి యన్నపుబండియే, కానిమ్ము నేఁ డిం
తటితో శాంతింపను. ఈయాలస్యమునకుం దగిన ప్రాయశ్చిత్తము చేసితీరెదను.
(దృష్టినిగిడ్చి) ఏమిరా! బండి నక్కడనే నిల్పి యూరకున్నావు? ఈయాలస్య
మునకుఁ గారణము నీవా? పురజనులా? (తనలో) వీఁడెవఁడో బెల్లము గొట్టి
నరాయివలె నెంకులకును సమాధానము చెప్పఁడు (కొండొక నడచి చూచి)
కడుఁ బొగరుఁబోతుగాఁ దోఁచుచున్నాఁడు! బండిలోఁ గూర్చుండి యందుఁ
గల భక్ష్యములన్నియుఁ దినుచున్నాఁడు. ఏమో కాని యీదినమంతయు మార్పు
గానే కన్పట్టుచున్నది. (ప్రకాశము) ఓరీ! తిండిపోతా! నన్నెఱుఁగుదువురా?
నాకై తెచ్చిన పదార్థము లుచ్ఛిష్టములు చేయుచుంటివా? ఇదిగోఁ జచ్చితివి.

(తెరలో)

ఈపదార్థములు నేను దినుటవలన నీకొకనష్టములేదు. ఏమంటివా? నేనుఁగూడ నీకా
హారమగువాఁడనే కదా?

బకు—(తనలో) ఓహో! వీఁడెవఁడో పురజనుల ప్రేరణచే నాతోఁ బోరవచ్చినవాఁడు
కాని నా కాహారార్థమై వచ్చినవాఁడు కాఁడు, అట్టివాఁడేకాకున్న నీధైర్యమె

క్కడిదీ? ఏమీ? ఈకంఠధ్వని! కడు గంభీరముగా నున్నదే? కానీ వీనిం జంపలేక పోదునా? (ప్రకాశము) ఓరీ! కపటాత్మా! నీచందంబు నేను గుర్తించితిని. నీవు నన్ను జయింపవచ్చితివిగా? అట్లయిన బండిదిగి యిటురమ్ము.

క. జీవమ్మును యమపురికిం, బోవిడలం గొట్టి దేహమును రక్తముతోఁ
బ్రేవులతో నిమిషములో, నావంతయు మిగులకుండ నాహారింతుణ్.

భీము—(ప్రవేశించి)

తే. గీ. కొంగవలె దొంగతిండిని గోరనేల? తులువ? జీవింపరాదె? యేవలనసైన
బుద్ధిగలిగెద వేనియుఁ బొమ్ము విడుతుఁ, గానిచో నేఁడు బంపింతుఁ గాలుపురికి.

బకు—ఓరీ! పదకుఁబోతా! "గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించిన" దన్నట్లు నాకు నీవు ధర్మపన్నములు గూడఁ జెప్పఁబూనితివిగా? అవుసు చెప్పకేమి?

ఉ. మాచినతోడనే కదిసి సున్నముగా నలుగంగఁగొట్టి లో
వైచుట మానినంను కిటువచ్చుమనున్నవి చిల్కపల్క లో
రీ! చిరకాలభుక్తమగు నీబలి మాన్పఁగ నీవకాదు కా
నీ చతురాననప్రముఖులేనియుఁ జాలుదురా? దురాత్మకా.

దీనికేమిగాని నిన్నుం జూచిన నాకుఁ బరమానందం బగుచున్నది. ఏమంటివా? నేను బుట్టి బుద్ధియెఱిఁగినది మొదలిప్పటి కీమాత్రము ధైర్యముగా నాతో మాటలాడినవానిఁ జూడలేదు. అందులకే నిన్నింతవఱకు పేక్షించితిని. ఇఁక నుపేక్షింపను.

భీము—ఓరీ! మూర్ఖాగ్రేసరుఁడా! ఈప్రగల్భము లేమిగాని నే నొక్కటి చెప్పెద నాలింపుము.

ఉ. నీకలెనే పొగర్మిగిలి నిక్కి నఱ్ఱ జెనకంగ వచ్చె నాఁ
డావనిలో హిడింబుఁ డను నామిషఖాది, తుత్రుటిన్ వధించి దు
ర్వారపురి వాని నయ్యమపురంబున కంపితి వానికన్న నణ్
జీవగలాఁడవే? యతనిచెల్లెలి నేనియుఁ బోలనేర్తువే.

(అంత హిడింబ ప్రవేశించును)

హిడిం—(నమస్కరించి) ఆర్యపుత్రా! జయము, జయము. ఇతఁడు మీ రంత చులుకనగాఁ జూడఁదగినవాఁడు కాఁడు. మాయన్నయు, నితఁడును, వీనితమ్ముండు గిమ్మీరుండును, జరాసంధుఁడును, గీచకుఁడును, దుర్యోధన దుశ్శాసనాదులును, నించుమించుగ సమానులు, కాని యింతుచో నొక్కఁడెవ్వరిచే మృతినొందునో

తక్కినవారందఱును నాయనచేతనే చచ్చిరని వినియుంటిని. కావున మీ కితఁడు సుకరముగనే జయింపఁదగినవాఁడు కాఁడనుచున్నాను.

బకు—ఓసీ! పరమదుర్మార్గురాలా! కామమోహితవై యన్నం జంపించి యీ యపరాధముం గట్టుకొని యంతం బోక వీనికి సంతతిం గూడఁ గని రాక్షసకులమున కపకీర్తి తెచ్చితివే? ఛీ! నీ మొగము చూడఁగూడదు దూరముగాఁబొమ్ము. నీవు చూచుచుండఁగనే నీమగనిం జంపుదును. చూడుము. (భీమునివంకఁ దిరిగి) ఓరీ! నరపశువా! హిడింబుం జంపితినని గర్వించుచుంటివిగా? అది నీ ప్రయోజకత్వముగాదు వినుము.

తే. గీ. తనదు చెల్లెలు నిన్నుఁ గోరినకతమునఁ, దాని మేల్మిక్కిలిగ నెదఁదలఁచు కతన
నిన్నుఁ జంపఁగ లేఁడాయె నీచ! లేక, యున్న నీవేడ? మా హిడింబన్న యేడ?

భీము—(తనలో) ఓహో! సమయమునకు నాప్రియురాలు కూడ నాకు సహాయురాలుగ వచ్చినదే! (స్మృతినభినయించి) అవును నాఁడు "నన్నెప్పుడు మీరు దలఁచిన నప్పుడే వత్తు" ననికదా? చెప్పినది. ఈమె యిట్టిదివఱకనేకపర్యాయములు వచ్చి యుపకారము చేసెను. (ప్రకాశముగా) దేవీ! నీవు కడు సత్యసంధురాలవు. నీవొనరించిన యుపకారమును మాతల్లి తఱచుగఁ దలంచుచునే యుండును. నేనిద్దురాత్ముని వధియించుదనుక నీవిక్కడనే యుండి చూచుచుండుము.

బకు—(నవ్వి) ఓరీ! మానవాధమా! ఎట్టి చూచుటయే కాదురా! నీవంటి యసమర్థుఁడగు నరాధముఁడను గాకపోఁ బట్టిగాని లేనిచో నియ్యాడి వధియింపనే గలదురా

ఉ. ఎందఱిఁ జంపె నీయతివ, యెందఱిరక్తము గ్రోలె మున్ను, దా
నెందఱికొవ్వు మ్రింగె మఱి యెందఱిమాంసము లాహరించె నేఁ
డందఱు మాన్పృథుల్ శిరము లక్కట! యొక్కట వంచుకోఁగ ని
న్నుం దగు లొందె యన్యాయమునున్ జెడఁగొట్టెద దానునున్ జెడెన్.

(హిడింబదిక్కు) ఓసీ! తెలివితక్కువదానా! జరిగినదేమో జరిగినది యిప్పుడేని నామాటవిని బుద్ధితెచ్చుకొని వీనింజంపి నీయున్నతు వచ్చిన యపకీర్తిను బోఁగొట్టుకొనుము. నీకు వచ్చినభయము లేదు. నేను బైనుండి చూచుచుండెదను.

శా. వీనిం జంపిన "భర్తయొవ్వఁ" డనుమన్ వీక్షింపఁగాఁ బోకు మీ
వీ నీచున్ వరియించుటే మొదటితప్పౌటకే లేశ మ్మొకం
గా నంకింపమి గొప్పతప్పిటు మొదల్ గావింపు మాపైని నే
నే నిన్నున్ వరియింతు దానవకులం బేలింతు నీచేతనే.

భీము—(కోపముతో నొకచేత దవుడలును నొకచేతఁ గంఠమును నొక్కి) ఓరీ! వాచాటా? ఏమని పేలితివి? ఇదుగోఁ జచ్చితివిరా. (గెంటుకొనిపోవును)

(తెరలో)

బకు—ఓరీ! నరాధమా! ఈగుద్దు కాచుకొనుము.

హిడిం—అక్కటా! నాథుని కంఠగుద్దు తగిలినది! (చూచి) అయ్యో! మూర్ఛిల్లినట్లున్నాడే! (పరికించి) లేదు లేచి యేమో అనుచున్నాఁడు. (తనలో)

తే. గీ. నీకును హిడింబునకుఁ గల నేర్పు తార, తమ్యముల్ జూడఁగా మదిఁదలఁచి యొక్క గుద్దు నవకాశమిచ్చితిఁ గూర్మి? నీచ? యింకఁ జూడుము నీ బ్రదుకేమియగునొ?

హిడిం—మరల బకుఁ డేమో యనుచున్నాఁడు. (తెరలో)

ఓరీ! వాచాటా! వృథాగర్వాటోపా! క్రిందఁబడ్డను మీఁదివాఁడనే యనుచుంటివిగా? ఇదిగో, ఈసారి యీ కాలితాఁకుతోఁ గూలెదవులే.

హిడిం—(సంతోషముతో) బళే! నాథా! మంచిపని చేయుచున్నావు. అట్లనే రెండు కాళ్ళును బట్టుకొని త్రిప్పుచుఁ దీసికొని పోయి యీ సాలవృక్ష స్కంధమునఁ బెట్టి తల పగులఁ గొట్టుదువుగాక. (తెరలో)

ఉ. కిన్నెన నేకచక్రపురి కేరి మునంబుధి మున్గుఁగాక దా
నవ్వుల నున్న నీభటులు దైన్యము గొందురు గాక మీఁద నిం
కెన్నఁడు నీ తలెం జగము నేర్చక పోయెడుఁగాక యెట్లైనన్
దివ్వెన తాటిపండువలె నీతల త్రెళ్ళెడుఁ గాక దుర్మతిన్.

హిడిం—(సంతోషముతో) ఔరా! గుణాత్మా! నన్ను నరాని మాటలనినందులకుం దగిన ఫలము నందితివి. ఇఁక నెంతసేపు భూమిపయిం బడి గింజుకొనెదవు. ఈపాటికిఁ జావుము. (తనలో) జయలక్ష్మీపరివృతుఁ డగు నాథుని నికటమ్మునకుఁ జని స్వయముగ ప్రేమాలింగనమ్మున సమ్మానించెదంగాక. (నిష్క్రమించును.)

గద్య

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బగు పాండవప్రవాసమ్మునఁ

ద్వితీయాంకము.



# పాండవప్రవాసము.

## తృతీయాంకము.

(అంత భటుఁడు ప్రవేశించును.)

భటు—(తనలో) నాకుఁ బ్రభువుగారాజ్ఞ యిచ్చిన చొప్పున నాసనములన్నియుఁ దారతమ్య వివక్షగా నలవరించితిని. మత్స్యయంత్రమిదివఱకే సంసిద్ధమై యున్నది. రాజకుమారులందఱును వచ్చెడివేళ కావచ్చినది. కావున ద్వారముగాఁ బోయి యీయుదంతమును మహారాజుగారికి మనవిచేసిన వారే వచ్చి వీరల గౌరవింతురు. (నిష్క్రమించును.) (ఇది ప్రవేశకము)

(అంత ద్రుపదుఁడు పురోహితునితోఁ బ్రవేశించును.)

ద్రుప—గురువరా! ధ్రువముగాఁ బాండవులు కుశలముగా నున్నారనియే కదా ? మీరు సెలవిచ్చితిరి.

పురో—ఔ? ఇంకను సంశయము గూడనా ? నేను జ్యోతిషముచేఁ జూచుటయే కాదుకీ పిదపఁ గొందఱివలనఁ గూడ నీసంగతిని వింటిని.

ద్రుప—ఏమని వింటిరి ?

పురో—వినుట కేమున్నది ? విదురుఁడు దుర్యోధనుని దురభిప్రాయ మెఱిఁగి రహస్యముగా నొక ఖనకునిబంపి యాలాక్షాగృహమ్మునఁ బాండవులకుఁదక్క నితరులకెఱుఁగరాకుండ నొక పెద్దబిలము త్రవ్వింపఁజేసెననియు భీముఁడు పురంజనుఁడింక నెప్పుడో నిప్పునంటింప వలెనని యనుకొనుచుండ ముందుగానే వానికిఁ దెలియకుండఁ దా నగ్గిదగిల్చి సోదరులను దల్లిని దీసికొని యాబిలముత్రోవను వెలువడిరనియుఁ బురంజనుండును మఱియొక నిషాదవనితయును దానికొమరులేగురును నందుంబడి చచ్చిరనియు వింటిని.

ద్రుప—కపటియగు పురంజనుని మాటకేమిగాని నిరపరాధులగు నిషాదులు చచ్చుట కడు శోచనీయము.

పురో—అదియును విచార్యముగాదు. ఆనిషాది పాండవుల గుట్టును బురంజనునికిఁ దెల్పుచుఁ బుష్పఫలాదు లర్పించు మిషచేఁ గుంతీమహాదేవియొద్దకు వచ్చుచుఁ బోవు

మండెడి దుర్మార్గులు. నాఁటిరాత్రి మద్యపానవశమ్మున నాయింటి పంచం బడి సుతసహితముగా నిద్రించుటం జేసి వ్యాతిసందె.

దుప్ర—అట్లయిన నిదియును నిట్లు కాఁదగినదే! మహాత్మా! ఇంతవిస్పష్టముగాఁ మీఁకీ యుదంత మెట్లు తెలిసినది?

పురో—అఖిలము త్రిప్పిన ఖనికునిభార్య పుట్టినిల్లును నా పెద్దకుమారుని యత్తవారియూరును నొకటే యగుటచేఁ గ్రమముగ స్త్రీలవలన నియ్యది తెలిసినది. దానికి దథ్యముగాఁ బ్రశ్నశాస్త్రముగూడ వారెండఱు సుఖులైయున్నట్లు సూచించినది.

దుప్ర—పాపము! ధృతరాష్ట్రుఁడు వీరలకుఁ గ్రమముగాఁ బారలౌకికక్రియలు గూడ నొనర్చినాఁడఁట సుఁడీ.

పురో—అవునఁట ఆయనకేమి తెలియును? విదురుఁ డెఱిఁగియును జెప్పుటకు వలనుపడమి నూరకొనియుండును. (యోజించి) పోనిండు దీనివలనఁ బాండవులకుఁ గీడాపరిహారము కావచ్చును.

దుప్ర—ఇంతకును నాదుర్యోధనుని దుర్యోగ్యత కారణము. ఇప్పటికి వృద్ధరాజుమాత్రము తమ్ముని కొమరులయందుఁ దన కొమరులకన్నను నెక్కుడు దయ గలిగి యున్నాఁడనియే చెప్పికొందురు.

పురో—అదియును మనము నమ్మఁదగినది కాదు. (విని) అదుగో రాజకుమారాగమన సూచకమగు మంగళధ్వనులు వినవచ్చుచున్నవి. మనము వారల నెదుర్కొనవలయును. (పరిక్రమింతురు.)

(అంత సుయోధన దుశ్శాసనకర్ణులును కృష్ణబలరాములును బ్రవేశింతురు.)

పురో—అయ్యా! దయచేసి యీ యాసనముల నధిష్ఠింపుఁడు.

(అందఱును యథోచితంబుగాఁ గూర్చుందురు)

దుప్ర—(దృష్టి నిగిడ్చి) గురువర్యా? అదుగో! మఱికొందఱు రాజపుత్రులు వచ్చుచున్నారు. వారలనందఱిని యథోచితపీఠమ్ముల నలంకరింపఁజేయుఁడు.

పురో—అట్లనే యొనర్చెదను. (నిష్క్రమించును)

దుప్ర—(మఱియొక దిక్కు చూచి) ఎవరురా? అక్కడ.

భటు—(ప్రవేశించి) జయము జయము. ఆజ్ఞాపింపుఁడు.

దుప్ర—బ్రాహ్మణప్రకరులనేకు లీయుత్సవముఁ జూడ నేతెంచుచున్నారు. వారలనందఱి నుచితరీతి గౌరవించుటకై మన ధృష్టద్యుమ్నునితో మాయాజ్ఞఁ దెల్పుము.

భటు—చిత్తము (నిష్క్రమించును.) (ధృష్టద్యుమ్నుఁడు ప్రవేశించును.)

దృష్ట—తండ్రీ! ఎల్లరును యథోచితస్థానమ్ములం గూరుచుండిరి, పురోహితులగ్నిని వేల్చుచున్నారు. ద్రౌపదియును సఖీసమేతయై యిటువచ్చియున్నయది. ఇఁకఁ గర్తవ్యము వీరలతో నివేదించెదను.

ద్రుప.—ఆలస్యమెందులకు? నివేదింపుము.

ధృష్ట—ఓ ధానుష్కశేఖరులారా!

ఉ. ఆమె మదీయసోదరి సమగ్రగుణాకర సర్వలక్షణ
శ్రీమహనీయ యాధనువు చేకొని యేడ్తెఱ మత్స్యయంత్రమిం
దీమహితుండు దా నఱుకు నేనుశరమ్ముల నాతని స్వఘన
ప్రేమమునన్వరించు, వివరించితి నున్నయథార్థమంతయున్.

తే.గీ. కన్యకాలాభ మొక్కండె కాదు నందు, నెక్కుడు యశంబుగల్గు మీకింతకలన
సాధనువు మాకు నొక్కమహాత్ముకతన, దొరకె నది యెక్కువెట్టుటే దుర్లభంబు.

దుర్యో—(అపవారించి కర్ణునితో) సఖా దానిని నీవెక్కువెట్టి యాసుందరాంగిని వరింపుము.

కర్ణ—(అనాకర్ణితముగా) చెలికాఁడా! అటు చూచితివా?

క. కని కొందఱు దరిదరిగాఁ, జని కొందఱు ముట్టికొని వెస న్గొందఱునున్
గొనమువిగలాగి కొందఱు, వెనుకకుఁ జనుచున్నవారు పృథ్వీశసుతుల్.

దుర్యో—మిత్రమా! వీరలవలన నేమగును?

క. ఆలలన యాతలోదరి, యాలలితవిలాస సామహాభాగ్యశ్రీ
లీలావతార చెలి నీ, పాలగు నిక్కముగ నెఱుఁగఁబడియె నాకున్

దుశ్శా—అన్నా! నీవలనన్లే కాని యాశిశుపాలుని సంరంభము చూడుము.

బల—(కోపముతో తనలో)

క. ఓ శౌరిమూర్ఖ! నీదోర్వేగము నీవెఱుఁగలేక చాపమ్మునఁ గేల్
పూరించితి వేమాఱు, న్నారిద్దగిలింపలేమి నాకెఱుక సుమీ?

కృష్ణ—అన్నా! మినపగింజంత మిగిలి పోయెను గాని లేనిచో నితఁడు కృతకృత్యుఁడే యగును జుమీ!

బల—తమ్ముఁడా! ఒకవేళ వీఁ డెక్కువెట్టునే యనుకొందము; అంతతో నేమగును?

కం. అంబరమునంటఁ గలమత్స్యంబున్ దగనఱుక వలయు నయ్యది సామా
న్యంబే? యిల్లలికినమా, త్రం బండువయగునె? యదియుఁ దగమే? తఱకుఱ

కృష్ణ—! అడుగో జరాసంధుఁడు తనయావచ్ఛక్తియు వినియోగించుచున్నాఁడు (పెదవివిఱిచి) పాపము! ఇతనికిని యామాత్రము కడమ యైనది.

దుర్యో—సఖా! ఎందులకీయాలస్యము? నీకుఁదక్క నొండొరుల కయ్యది సాధ్యముకాదు.

కర్ణ—అడుగో శల్యుఁడు రంగస్థలమున కవతరించుచున్నాఁడు

దుర్యో—ఎవ రవతరించినను నొకటే మన మెఱుఁగనిశల్యుఁడా? యేమి.

కర్ణ—ఓహో! ఇతఁడును దుద కొకపెసరగింజంతలోఁ దేలిపోయినాఁడు (తనలో) నాకును నియ్యది పరాభవస్థానమే యగునా? కాదు (పరికించి) యాదవులెవ్వరును నా వంకకే రాక యున్నారు కారణమేమొ? కృష్ణబలరాములే మిన్నకున్నప్పుడు మనకు సాధ్యమగునా? యని సంశయించిరి కాఁబోలును, ఇంతియకాదు కృష్ణుఁడు వారల కెందులకో? యింతకసంజ్ఞకూడ చేసినట్లున్నది, (యోజించి) కృష్ణుఁ డూరకొనుటకు హేతువేమో? (బింకముగా) ఇది కృష్ణునకును గిష్ణునకును సాధ్యమయ్యెడిది కాదు (నడుముగట్టుకొని నిష్క్రమించును.)

దుర్యో—(సంతోషముతో) సఖా! ఇఁక) దిలప్రమాణము మాత్రమే కొదవ. పట్టువదలకుము.

ధృష్ట—(ఆత్రముతో) ఔరా! తుదకీ సూతసుతునికి నాచెల్లెలి నీవలసి రాదు గదా! (సంతోషముతో) ఆ! ఇక్కడికీయిక్కట్టు దప్పినది, వీఁడును విముఖుఁడైనాఁడు.

బల—తమ్ముఁడా! నీవూరకొంటివేమి?

తే.గీ. మత్స్యయంత్రముఁ దెగఁగొట్టి మద్రరాజ, కన్యకను లక్షణను లోకమాన్యచరితఁ
గైకొనినయట్టి నీకులక్ష్యంబె? యిదియు, నెందులకుమిన్నకుంటివో యెఱుఁగఁజెప్పుమ?

కృష్ణ—(రహస్యముగా)

కం. కనుఁగొంటివె? యావిప్రుల, ననఘుల నవ్వారియంద యైదుగురును బాం
డునృపాత్మజు లున్నారర్జునుఁ డీయంత్రమ్ము నేయు నుదతి వరించున్.

(అంత బ్రాహ్మణవేషముతో నర్జునుఁడు ప్రవేశించును!)

(అందఱును నొకరిమొగము లొకరు చూచుకొందురు.)

బల—(సంతోషముతో) పాండవు లింకను కుశలముగా నున్నారా? (చూచివిచారముతో)

కం. ధృతరాష్ట్రునికొడుకులు దుష్కృతులు ప్రయోగించినట్టి మాయలకున్ ద
ప్పితిరే? యక్కట! యీక్రియ, క్షితిసురవేషములు విధి లిఖించెనె? మీకున్.

అరు—(తనలో) పూజ్యులగు కృష్ణబలరాములెట్లు చూచుచున్నారో? వీరుగుర్తించినట్లు

న్నదే, (వలఁదిసలగనుఁగొని) ఇతఁడెవ్వరును నన్ను గుర్తించినట్లులేదు (ధనువున్నచోటి కిఁ జనును)

ద్రుప—(పరికించి)

చ. వెడఁద యురమ్ము, మూఁపు లన వీనుల కంటుచునున్న యద్దిరే ?
పడికెడఁ గాను. నేత్రములు పెద్దవి, తక్కినలక్షణంబులుం
గడురమణీయముల్ ద్విజుఁడనం దరమే? యితనింజగమ్ములో
క్కఁడెయయి యేలఁగాఁ దగఁడె? కట్టెఁడి నాఁ జనదే? విధాతృనిన్
గాన యితని నేనెప్పుడో యొకపరి చూచినట్లున్నాఁడను.

ధృష్ట—(ఆశ్చర్యముతో)

తే.గీ. వేదపాఠుండితం డేడఁ బెద్దపెద్ద, చతురులఁ బరాభవించునీచాప మేడ
నంచుననుకొంటి నితఁడదియశ్రమమున, నెక్కువెట్టెనునిఁకయంత్ర మేయనున్న

దుర్యో—(ఆశ్చర్యముతో) ఏమీ యీబ్రాహ్మణవటుని చాతుర్యము

కం. చిరపరిచిత మగుచాపము, కరణిన్ శ్రమమింతలేక గైకొని గొనమున్
సరిచేసి కూర్చి యంత్రము, నఱుకుచునున్నాఁడు వాఁడి నారాచములన్.

దుశ్శా—(ఆశ్చర్యముతో) అన్నా!

తే.గీ. సూతపుత్త్రియంతటిశూరవరుని, కలవిగానట్టి యీకృత్య మలఁతిగా స
మర్థనమొనర్చనీవిప్రుఁడహహా! యెవఁడో, యెవరిశిష్యుఁడో? తలిదండ్రులెవ్వరో క్కొ

దుర్యో— దీని కింతవిచార మేల? బ్రాహ్మణులలో మాత్రము శూరాగ్రేసరులు లేరా?

తే.గీ. పరశురాముని లోకైకగురుని వినమె? యతనిశిష్యుండెకడ ! తాత యఖిలజేత
ఇంతయేందుకు ? మనగురువెవ్వ రమ్మ, హాత్ముఁడొకొమరుఁడశ్వత్థామకన్య వీఁడె!

ద్రుప—(చూచి) యంత్రము నఱికి యీవిప్రార్భకుండు చాపధారియై యిక్కడికేవచ్చు చున్నాఁడు. (అర్జునుఁడు ప్రవేశించును)

ద్రౌప—(ప్రవేశించి సిగ్గుతోఁ బుష్పమాల యతని కంఠమున వైచినను.)

ద్రుప—(విచారముతో)

క. పాండవమగ్గ్యమునకు నా, ఖండలతనుజాతునకును గన్నియనిడఁగా,
గొండాడితుదకుఁ గార్ముక, పండితునకు నీయవలసె బ్రాహ్మణున కయో!

అయినను నీవిషయ మింకను బరికిలింపవలసియున్నది, కాని పరిశీలించి చేయవలసినదిలేశ మును గానరాదు.

దుశ్శా—(జనాంతికముగా) అన్నా! చూచితివా? యీరాజు మనకందఱికిని నెట్టియ వమాన మొనర్చెనో? కావున నితని కిప్పట్టునఁ దగినశాస్తి యొనరింప వలెను.

దుర్యో—అవును; అట్లవశ్యమును జరుఁగదగినదే? (ప్రకాశముగా) ఓయీ! పాంచాల భూపాలా?

ఉ. ఇచ్చితి కూఁతు, "యంత్రమును నేసె" నటంచొక పాఱువానికిం
గొంచెముచేసి, శూరులగు భూవరు లూరక పోవ నేర్తురె?
యిచ్చినత్రోవ వెంబడిని, వహ్వారె! క్రొవ్వునఁ దెచ్చుకొంటె వీ
ముచ్చట, నీకు నిక్కటిన ముప్పు ఘటింపక మానదెమ్మెయిన్.

కర్ణు—(ప్రవేశించి)

కం. అవిప్రపటునిలోపం బావంతయు లేదు మాకు నవమానంబు
న్నీవొనరించితి, విందుల, కేపగ నుత్తరము చెప్పి దేర్పఁదగవలయున్.

ధృష్ట—ఓయి: సూతపుత్రా! నేనొక్కటి చెప్పెద వినుము.

ఉ. కట్టనమత్స్యయంత్రమును గాఁడఁగ నేసినవానికే కదా?
పట్టనొసంగు నీనృపుఁడు, పార్థివు లేమిటి కల్గఁగాన లేర్?
దిట్టతనంబు గల్గుటకుఁ దెల్వియుఁ దేటయుఁ గల్గియుక్తికిం
బట్టగు పట్టునన్వలయుఁ బట్టును బంతము శూరభావముల్.

తే. గీ. ఊగకేగుద్దు లాడుట యుక్తిగాదు, పార్థివులకిచ్చెద మటంచుఁ బల్కె నామె
ఇంత యేందుకు? యంత్రమిమా వేసితేని, నీకె యీయఁడె రాజవా? నీవు చెపుమ?

కర్ణు—(తనలో) అక్కటా! వీఁడు నన్నుమఱియు నవమానించినాఁడే.

కృష్ణ—చిన్నవాఁడైనను మంచి యుక్తిగాఁ జెప్పినాఁడు

ఉ. విద్దియ చూచి యివ్వనితఁ బెండిలి యాడెదఁగాని "యన్యథా
బద్ధ" యటన్న యంశమిట నేర్పడ లే దొకయించుకైన, లెం
డద్దముగట్టినట్లు కననౌవిషయంబున లేనిపోనియా
సుద్దులు పెద్దలౌనృపులు చూచిన నవ్వుదు రింతయేటికిన్.

దుర్యో—(గర్వముతో) వాసుదేవా? యేమి నీవిట్లు చెప్పుచున్నావు?

తే. గీ. కార్ముకపుఁగృత్య మిద్యోపఁ గలదుగాన, నదియు రాజులకే విధియగును గాన
రాజులే యర్హులనెడి యర్థమ్ము వచ్చు, యోగ్యతను జూపకుండుట యుక్తమగునె?

దుశ్శా—సంశయమేమి?

ఉ. పాండుఁడు యంత్రమేసె నని పట్టి నొసంగుట ధర్మమా? సెం
పారెడి యగ్రహారములొ? యంతకుమున్ బయిపెద్ద భూములో?
చీరలొ? మాడలో? ధనమొ? నేలువులో? యొసఁగంగరాదె? యే
ధారుణిఁ గల్గు? నిట్టిపని, తప్పపను ల్సహియింప టొప్పునే?

బల—(కొంచెము కోపముతో) దుశ్శాసనా! నీవు చిన్నవాడవు, ఇందు వివాదాంశము లేశమును లేదు. ఊరకొనుము.

క. ఎందఱురాజులు విప్రుల, కొందఱఁ గన్యలనీయ? రిదియొకతప్పా?
తందగపడు టుచితంబే, గందరగోళంబు మానికదలుఁడు నృపతుల్.

కర్ణ—(తనలో) ఈద్రుపదుని నిప్పట్టున నెట్లైన యవమానించి త్రిప్పవలయును. ఇందుల కుపాయ మేమో? (యోచించి) ఇట్లగుగాక (ప్రకాశము) బ్రాహ్మణులకుఁ జాతుర్వర్ణ్యవివాహ ముండుటచే నితఁ డీయనుఃచ్చును నతండు పరిగ్రహింపను వచ్చును, గాని యింకొక విశేషము మాత్రమున్నది. బ్రాహ్మణుఁడు క్రమముగా నాలఁగుజాతుల కన్యలను బెండ్లి యాడవచ్చును గాని మొట్టమొదటనే క్షత్రియకన్యకం గొనదగదు, అట్టివాని కితఁడు వర్ణాశ్రమ ధర్మములను జక్కఁగాఁ బాలింపఁదగురాజ యన్యాయ మెట్టులిచ్చుచున్నాడు? కావున నవశ్యమును నితఁడు దండ్యుఁడ యగుటంజేసి మేమితనిని విడువము.

భీమ—(బ్రాహ్మణవేషముతోఁ బ్రవేశించి కోపముతో) విడువ రేమి? విడువక చేసెడి దేమో? చేయుఁడు— (తెరలో)

శూరాగ్రేసరులగు నోబ్రాహ్మణవటువులారా మీరు వెనుదీయవలదు మీతోపాటు మేము సంసిద్ధులమైయున్నారము. మీకువచ్చిన భయములేదు.

క. శపియింతుము మంత్రమ్ములు, జపియింతుము వలసెనేని జంపన్ జాలన్
గృపణాలము కాము నిక్కము. దపమంతయు ధారపోయఁదలచితి మిందున్.

ఓరీ! పేరిశాస్త్రీ? నీవు పోయి పరశురాముని బిల్చుకొనిరా. ఔరా? పాపాసధానీ? నీవరిగి మనద్రోణాచార్యులను కృపాచార్యులను అశ్వత్థామను దీసికొనిరమ్మ. ఈరాజు లేమిచేసెదరో చూడవలెను.

అర్జు—(చేయెత్తి) ఓతపోధనులగుబ్రాహ్మణాగ్రేసరులారా? మీరేమియుఁ జేయనక్కఱ లేదు. మిన్నక చూచుచుండుఁడు.

దుర్యో—(నవ్వుచు) తమ్ముఁడా? యీవిప్రులెల్లనంగవస్త్రమ్ములు జారీకొమ్మల కట్టు ముడివైచి నిలుచున్నారో? చూడుము.

కర్ణ— కార్ముకవిద్యానిపుణుండ వగుదో విప్రనందనా! నేనొక్కటి చెప్పెద నాలింపుము.

ఉ. పుట్టిననాఁట నుండియును భూసురకోటికిఁ గేలు మోడ్చునె
ప్పట్టున వారితోడను వివాద మొనర్చుట కిచ్చగింప నీ
కిట్టుల నేని జేపడియె నీనృపుకన్నియ. దానికేమి? మా
పట్టినపట్టు మిమ్ములను బట్టదు పార్థుడు రూపుమాపెడున్.

కం. శూరు లగురాజవరులకుఁ, బాలురతోఁ గలహ మన్నఁ బక పక నగరే?
ధారుణిప్రజ లెల్లరుమీ, రీ రమణిం దీసికొంచు నేగఁగ వచ్చున్.

ద్రుప—(తనలో) ఓహో! యీసూతాధముఁడు వృథాగాఁ గలహముం బెంచుచున్నాఁడు. వీనిఁబట్టి దుర్యోధనాదులును వారింబట్టి తక్కిన రాజమండలమును దిగకమానరు.

ధృష్ట—(ఎకసక్కెముగా) ఓయి? సూతపుత్రా? ఉత్తమక్షత్రియునకుఁ బ్రాహ్మణులతో యుద్ధము తగకుండు నేమో? కాని సామాన్య నృపతులకును నీవంటిసూతవంశజులకును నిట్టి విచార ముండదు. కదా!

ఉ. మంచియుఁ జెడ్డయున్ దెలియుమానిసి "కియ్యది యుక్తమిద్దిగా"
దంచు విచారణంబు, దురహంకృతిశాలికి మంచిచెడ్డ లెం
చెంచఁగనున్నవే? కొంటుల నేని వృథాకలహమ్ము పెంచి తా
వంచన సేయఁబూని యట వంచన గాంచుటయే స్వభావమౌ.

భీమ—(ఎకసక్కెముగా) ఓయీసూతాధమా!

తే॥ గీ॥ పూని నీచేత సజ్యంబు గానిధనువు, లీలఁ గొనియంత్రమేసె నిబ్బాలకుండు
"ఇతనితోఁ బోరలే" అని యెవ్వ రెఱుఁగ. రేని మూరక నవ్వెద రెల్లవారు.

అర్జు—నీవు బ్రాహ్మణులతోఁ బోరవేమో కాని మేము క్షత్రియులతోఁ గాని తదన్యులతోఁ గాని పోరుట కభ్యంతరములేదు.

ఉ. ఎంతటిజ్ఞానశూన్యుడవొ యిట్టి కుయుక్తులు పన్నుచుంటివా
యింతినిఁ గొన్నవానిపయి నెవ్వనికేనియుఁ గోపముండు నా
యింతిని గన్నవానిపయి నేటికిఁ? గోప మొకింత చెప్పుమీ
పంతముగల్గెనేని ననుఁ బట్టుము కొట్టుము నెట్టుమీసతిన్.

ఆ. వె. ఇంత తెలివితక్కు వెందు నేఁ గనలేదు, ద్రుపదుఁ డెవరు? నాకు నృపుఁడనొకని
నింతమందిమీఁద లేకమై వధియింప, నూరకేను జూచుచుండవలెనె?

ద్రుప—(తనలో) ఇతని ధైర్యస్థైర్యాదికము చూచిన బొత్తిగా బ్రాహ్మణుఁడని లేశముగా గానరాకున్నది. (యోజించి) ఏమో! అట్లనుకొనుటయు వలనుపడదు; పరశురాముఁడు లేడా? ద్రోణాదులు లేరా?

కర్ణు—(ఏకపక్కముగా) నాతెలివితక్కువను జూతువు గాని రంగమునకవతరింపుము. ముందు నీక్రొవ్వడఁగించియే పిదప జామాతృబాహుబలాహంకారంబనో దుర్భర గర్వాస్పదుండగు నీద్రుపదునియు భగినీపతి ప్రపన్నశపరాక్రమజనితదుర్గర్వనిమగ్నుండగు ధృష్టద్యుమ్నునియుఁ బస్లణగించెద. (కర్ణార్జునులు నిష్క్రమింతురు.)

భీము—(దుర్యోధనుని దిక్కై యొక్క పక్కముగా) అదిగో పాపము! మీతమ్ములందఱును మాబ్రాహ్మణుని ధాటికి నోడి పాఱుచున్నారు. మీరు చూచి యూరకొనుచున్నారేమి ?

దుర్యో, దుశ్శా—(తమలో) ఏమి యీపాఱుని పొగరు? (చూచి) ఇదిగో మేము వచ్చుచున్నాము. నిలువుడు. నిలువుడు. (నిష్క్రమింతురు)

భీము—(చూచి తనలో) తమ్ముఁడును గర్ణుఁడును దుల్యముగాఁ బోరాడుచున్నారు. కృపాశ్వత్థామలూరక చూచుచున్నారు. కర్ణుండు కొంచెము తీసిపోవుచున్నాఁడు, పోకేమి ? మన మెఱుఁగని కర్ణుఁడా? (ఆశ్చర్యముతో) ఔరా! వీరియవివేకము, ఇప్పటికేని తమ్మునింగుఱితింప లేరు. (కోపముతో) లక్కయింటఁ జచ్చితిమనియే కాబోలును వీరలదృఢనిశ్చయము. అదిగో దుర్యోధనాదులు గూడఁ గర్ణునికి బాసటయై తమ్మునిపైకి దుముకుచున్నారు కానిమ్ము వీరలపొగరు నే నణంచవలెను (నిష్క్రమించును)

ద్రుప—కుమారా! చూచితివా? రణ మెట్లు ప్రవర్తిల్లుచున్నదో. వీరలెవరో బ్రాహ్మణవేషము ధరించిన హరిహరులవలె నున్నారు.. (మఱియొక దిక్కు చూచి) అదిగో బ్రాహ్మణులందఱును నొకపెట్టునఁ గురుబలముపైకి నుఱుకుచున్నారు. మనము వీరికిఁ దోడుగానుండి కాపాడుదము పద. (కుమారునితో నిష్క్రమింతురు.)

బల—తమ్ముఁడా! యుద్ధమెంతభరముగా నున్నదో చూచితివా? భీమార్జునులే కనుపట్టుచున్నారు. కాని ధర్మరాజును గవలును నాకా బ్రాహ్మణ సంఘములో నానవాలుగాఁ దెలియకున్నారు.

కృష్ణ—ఉ. తాళమునంటి విల్గొనిన ధన్యుఁడు క్రీడి యనోకహంబుఁ దాఁ
గేల ధరించి మార్తురను గీటడఁగించెడువాఁడు భీముఁడీ
య్యాలము రాకమున్న శమనాత్మజుఁడున్ గవలున్ సమేతులై
యేలొకొ యేగి రక్కతన నిర్యోడ వారలు లేరు సోదరా !

బల—(చూచి) కురుబలమెల్లఁ బటాపంచలై యెట్లుపఱుగిడుచున్నదో ! (కోపముతో) ఓరీ ! మూర్ఖుడా ; దుర్యోధనా !

ఉ. గద భుజమందు వైచికొని కయ్యమునుండి తొలంగి పాఱి పో
యెదవె? మదీయశిష్యు నిటు లెల్లరు నవ్వఁగ నాఁడు దుర్గళం
బెనగి శిరంబు నెత్తుకొన నిచ్చెనె? నేఁటికి నిన్నుఁ జేరి యా
గడమును నాగురుత్వమును గంగకు నర్పితమయ్యె నేమిరా?

కృష్ణ— అదుగో నర్జునుఁడు జయలక్ష్మీలాలితుండై పాంచాలిని వెంట బట్టుకొని పోవుచున్నాఁడు,

బల— మన మిక్కడ నిఁక నెందులకు?

కృష్ణ— అదుగో ధృష్టద్యుమ్నుఁడిటు వచ్చుచున్నాఁడు. అతనితోఁ జెప్పి యొకసారి కుంతీదేవిం జూడఁబోవుదము.

ధృష్ట— (ప్రవేశించి తనలో) తండ్రిగారు "మన కన్నియఁ గొన్న బ్రాహ్మణు లెవ్వరో యెంజ నియెడలో పరిశీలింపు" మనియెను. అట్లొనర్చెద (పరికించి) అదుగో అవీధింబడి చనుచున్నారు.

కృష్ణ— పాంచాలకుమారా! మే మరుగుచున్నాము. (నిష్క్రమింతురు.)

ధృష్ట— (కొంతదూరము నడచి) అదిగో ఆకుంభకారగృహమునకుఁ బోవుచున్నారు. అక్కడ దాఁగి పొంచి వీరేమి మాట్లాడికొందురో వినియెద (అట్లొనరించి విని) ఈసంగతులన్నియుఁ బోయి తండ్రిగారికి విన్నవించెదను. (పరిక్రమించి) అదుగో తండ్రిగారు పురోహితులతో నీవిషయమునే కాఁబోలును ముచ్చటించుచున్నారు.

(ద్రుపదుఁడును బురోహితుఁడును బ్రవేశింతురు.)

ద్రుప— గురువరా! మీరు స్వయంవర మేర్పడిన దినఁ దప్పక యర్జునుండు వచ్చునని సెలవిచ్చితిరి కదా! అట్లు జరిగినదా?

పురో— ఇంకను సందియమేమి?

ఆ, వె. అర్జునునికిఁ దక్క నామత్స్యయంత్రమ్ము, నితరుఁ డేయఁజాలు నేటిమాట?
కర్ణునంతవాఁడు గజగజలాడెన, వ్వింట గుణము గూర్చ వెరవులేక.

ఇది యిట్లుండును.

చ. ఎగిరినవారి నెల్ల మద మేదఁగఁ జేసి యొకింతలోన న
వ్మ్రదపతిఁ గొంచుఁ బోవుటకు మాదృశవిప్రులకౌనె? లేశమున్
మదిఁ గడియింపఁబోకు మనుమానముఁ బ్రాహ్మణులేడ? పౌరుషా
స్పదులగు నీడ యింతపని సల్పఁగఁ బార్థుఁడు గాకయుండినన్.

ధృష్ట — తండ్రీ! నీయాజ్ఞచొప్పున నలవైనంతవఱకుఁ దెలిసికొని వచ్చితిని వారుమన యాజ్ఞసేనిం దీసికొని యొక్క కుంభకారగృహమ్మున కరిగిరి. అచ్చటికే కృష్ణ బలరాములుగూడ వచ్చిరి. అయ్యెడ నిఁక నొకముప్వురు పురుషులును నొకముసలియాఁపెయును గలరు.

పురో — రాజా! చూచితివా? ఆమె కుంతి వారు ముప్వురును ధర్మజనకులసహదేవులు; భీమార్జునులను రణరంగమునఁ జూచితిమికదా.

ద్రుప — కుమారా! యింతవరకేనా? నీయెఱిఁగినది.

ధృష్ట — ఇంతేకాదు. కృష్ణబలరాములును వారును మాటలాడికొనినరీతిం బట్టి చూడఁ దప్పక వారు పాండవులే యని నిశ్చయించితిని.

ద్రుప — అట్లయిన నీవు పోయి యీయుదంత మంతఃపురమునకుం జెప్పుము.

ధృష్ట — చిత్తము (నిష్క్రమించును)

పురో — యిక్కడికి నీసందియము తీఱినదా?

ద్రుప — తీఱకేమి? తీఱినది. అయినను మీరేగి వారియాథార్థ్య మింకను దఱచి తెలిసికొని యిక్కడికిం గొనిరండు.

పురో — (పోయి పాండవులతోడను గుంతీద్రౌపదులతోడను బ్రవేశించి.)

వీరు కుంతీమహాదేవులు, వారు పాండవులు.

ద్రుప — (వినయముతో) అక్కా; భోజపుత్రి!

ఉ. పావన మయ్యె నాకులము ఫల్గునుఁడల్లుఁడు కావుటన్, మహీ
దేవులుకారు మీరనుచుఁ దెల్ల మెఱింగితి నింతచేసిరే?
కావలువైన కౌరవులు, కష్టములెల్ల భరించి నేఁటికిన్
దేవుననుగ్రహమ్మున సుదీర్ఘత గాంచితి రల్లభంగులన్.

ఇఁక నాలస్యమెందులకు? విజయునిఁ బెండ్లికొమరునిఁ జేసి సలక్షణమ్ముగా వివాహతంత్రము నడపుకొందము.

కుంతి — అన్నా! పాంచాలభూపాల! అగ్రజులగు ధర్మజభీములుండఁగా) గొండిక యగు ఫల్గునునికిఁ బెండ్లియెట్లు? అదిగాక నావచనంబుకతమున నిక్కన్నియకు వీరేవురు నుబతులు గాని|యొక్కరుండు గాకుండు.

ద్రుప — (తనలో) ఈమెయభిప్రాయమే చక్కఁగా బోధపడినట్లు కాదు. ఒకకన్నియ కైదుగురు పతులెట్లు? (ప్రకాశముగా) ధర్మనందనా!

